శ్రీ




# రాజ్యలక్ష్మీవిలాసము

ఇయ్యది

గోదావరీమండల, కపిలేశ్వరపుర నివాసియగు

## కొవ్విడి శేషవేంకటకాశీపతి

విరచితము





మొదటికూర్పు 500.

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

---

రాజమహేంద్రవరము.

1918.

 [వెల రు. 0—4—0.

శ్రీ

# రాజ్యలక్ష్మీవిలాసము

ఇయ్యది

గోదావరీమండల, కపిలేశ్వరపుర నివాసియగు

క్రొవ్విడి శేష వేంకట కాశీపతి

విరచితము

---

మొదటికూర్పు 500

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది

---

రాజమహేంద్రవరము.

1918.

 [వెల రు. 0—4—0

# పోషక ప్రశంస.

సీ. అఖిలవిద్యాపోష ♦ ణాదృతి ఘనుఁ డైన,
భోజుని నెవ్వండు ♦ పోలినాఁడొ
భూతదయాసక్తిఁ ♦ బూరుషోత్తముఁ డైన,
బుద్ధుని నెవ్వండు ♦ పోలినాఁడొ
సత్యనిత్యవ్రతా ♦ సక్తి హరిశ్చంద్రు,
భూపతి నెవ్వండు ♦ పోలినాఁడొ
పరసతీవిముఖ స ♦ ద్భావనన్ శ్రీరాము,
మూర్తినినెవ్వఁడు ♦ పోలినాఁడొ.

తే. గీ. భక్తిఁ బ్రహ్లాదు వితరణా ♦ సక్తిఁ గర్ణుఁ
బోలె నెవ్వండు మనయాంధ్ర ♦ భూమిని నిపు
డట్టిశ్రీరావు సూర్యరా ♦ యాఖ్యనృపతి
పెలిచె నీకృతి ముద్రింప ♦ ధృతి నొసంగి.

కొ॥ శే॥ వేం॥ కాశీపతి.

ఓమ్.

శ్రీరస్తు

# అంకితము

ఏ యోషారత్నములు పాతివ్రత్యమునే భూషణముగా ధరియింతురో, ఏ కాంతాతిలకములు సంఘసంస్కారసత్ప్రయత్నమునఁ బురుషులకుఁ గుడిభుజములవలె సాహాయ్యపడుదురో, అట్టినారీమతల్లులఁ దల్లులఁగా నెంచి యీకృతిని మనఃపూర్వకముగ వారికే సమర్పించితిని. విదుషీమణు లైన పతివ్రతలఁ బ్రసాదించి మ మ్ముద్ధరింపవలె నని భారతమాత కంజలి నొనర్చుచున్నాఁడను.

గ్రంథకర్త,

ద్రివ్విడి శేష వేంకట కాశీపతి.

# పీఠిక

సీత, సావిత్రి, అనసూయ, లోపాముద్రి, చంద్రమతి, చంద్రవదన, సుమతి, సురభి, సుముఖి, పుష్పవేణి, అరుంధతి, దేవహూతి, ప్రియంవద, మొదలైన నారీమణు లను సమానపాతివ్రత్యప్రభావమున నార్యావర్తము నలంకరించిరి. గార్గిమైత్రేయులు దార్శనిక జ్ఞానమున, ఆత్రేయి శిక్షావటుత్వమున, భారతీదేవి సమగ్రవిద్యాపరిపూర్తిని, లీలావతి గణితశాస్త్రనైపుణ్యమున, వైజయంతి పాండిత్యోత్కర్షతను, మదాలస అపరిమితస్వామిభక్తిని, మీరాబాయి హరినామసంకీర్తనమునను, మొల్లమతరిగొండ వేంకమాంబలు భక్తిరసపరిపూరిత కవితావిరచనమునను, ప్రసిద్ధిని బడసి నారీలోకమునకుఁ దఱుగనియశముఁ గలుగఁజేసిరి. అహల్యాబాయి రాణీసంయుక్తలు క్షాత్రమును బ్రదర్శించిరి. అట్టియుత్తమాంగన లరుదై సంఘము తహతహలాడుచున్న సమయంబున భారతమాతృగర్భమున మన ఆంధ్రదేశమున పీఠికాపుర సంస్థానమున "కాతేరు" అను పల్లెయందు హిందూదేశము యంత్రనిర్మాణమునను, ఐకమత్యమునను, ఇతరరాజకీయవిషయములను నన్యదేశీయుల కెప్పుడైనఁ దీసిపోయినఁ బోవచ్చును గాని పాతివ్రత్యవిషయమున నెప్పటికిం దీసిపోవక పెక్కువాసులు మించుట కిట్లవతరించెనో యనునట్లుగాఁ బ్రాదుర్భవించి,

సర్వబంధువులు పరిత్యజించినను, గురుస్వాములు బహిష్కరించినను, ఎందఱెన్ని విధముల దూషించినను ద్వేషించినను పతితోడిదే లోకమని భర్తకుఁ బెట్టనికోటయై గుణమునకుఁ దగినరూపము రూపమునకుఁ దగిన యోరిమి యోరిమికిఁ దగిన పట్టుదల పట్టుదలకుఁ దగినవిశ్వాసము విశ్వాసమునకుఁ దగిన భక్తినిఁ గలిగి యద్వితీయసాంఘికమహాయుద్ధమున జయభేరిని వేయించి మనకన్నులయెదుట ననాయాసముగా నీశ్వరసాన్నిధ్యముం జేరినమాన రాజ్యలక్ష్మమ్మ పవిత్రచారిత్రము మనకవశ్యస్మరణీయము. తచ్చరిత్రమును గాలక్షేపం బొనరింప నుపక్రమించుచుంటిం గావున దయాపూరితచేతస్కులై యాలకించి యానందమును నొందరింపం బ్రార్థించి వందనము లొనరింపుచున్నాఁడను.

విధేయుఁడు,

క్రొవ్విడి శేష వేంకటకాశీపతి.

# ప్రార్థనాదికము.

సీ. హరికథల్ వినుటయం ♦ దాసక్తిఁ గల్గిన,
శ్రోతలారా! నాదు ♦ భ్రాతలార!
పేదసాదులపాలి ♦ పెన్నిధానము లైన,
దాతలారా! దేవ ♦ దూతలార!
సత్యమే జయ మంచుఁ ♦ జాటించుధర్మని,
ష్ఠేతలారా! సత ♦ త్రాతలార!
బ్రహ్మభేద్యం బైనఁ బరవస్తుతత్త్వవి
జ్ఞాతలారా! కామ ♦ జేతలార!
తే. గీ. నీతిపరులార! వరయశో ♦ పేతులార!
ఖ్యాతిఁ గనినట్టి యూనాతి ♦ పూతచరిత
మీకతని దెల్పవలె నన్న ♦ నూత్ననోత్సు
కతను నున్నాఁడ వినరయ్య ♦ కరుణతోడ.
ఉ. వింటి రనేకసత్కథల ♦ వీనుల కెంతయు విందొనర్పఁగాఁ
గంటి రనేకదాసులఁ బ్ర ♦ కాశకకీరులఁ గీర్తిధారులన్
గంటికి నైనదార్ఢ్యముగఁ ♦ గానఁగ రానటువంటివాఁడ నే
వెంటను దృష్టిసేయుమను ♦ వీనులఁజొన్పి నవీన మౌకథన్.
ఉ. దుండగు లెవ్వరైన నను ♦ దూలఁగనాడెద రంచు నూర కే
నుండుదు నొక్కొ? పూజ్యులగు ♦ ణోన్నతి వర్ణనసేయ
నుండఁగాఁ
బండితు లైనవారు గని ♦ బాగు సెబా సని యాదరించుచో
దుండగు లాడువాక్యము ల ♦ ఘోగతిఁ జెందక నిల్వనేర్చునే.

తే. గీ. కలముఁ బట్టినవారికిఁ ♦ గలుగుఁ దప్పు
కవితఁ జెప్పెడువారికిఁ ♦ గలుగుఁ దప్పు
నూరకుండినవారల ♦ కుండఁబోవు
తెలియఁ జేసినఁ దప్పుల ♦ దిద్దికొనెద.

## ఆంధ్రమాతృస్తవము.

హిందూస్థానీకాఫీ—చతురశ్రగతి.

ప॥ మమ్ముఁ గన్నతల్లి, మా, ఆంధ్రమాతా!
మా కీయఁగదవమ్మ! మంచిచేయూఁత!
అ॥ ప॥ సమ్మతి మమ్మ నీపాదయుగమ్ము
సమ్మద మొదవఁగా ననయమ్ము॥ మ॥
చ. అమ్మ! మాఋషు లుండు ♦ నాశ్రమమ్ము లేవి?
అమ్మ! మాప్రాఁబల్కు లన్నియు నేవి? ।మ॥ ౧
అమ్మ! మాగ్రంథరా ♦ జమ్ము లేమాయె?
అమ్మ! మారత్నశ్రే ♦ ష్ఠమ్ము లేమాయె? ।మ॥ ౨
అమ్మ! యువతీవివా ♦ హమ్ము లేమాయె?
అమ్మ! మామతబోధ ♦ లన్ని యేమాయె? ।మ॥ ౩
అమ్మ! నౌకావ్యవ ♦ హార మేమాయె?
అమ్మ! మావిలుకవిద్య ♦ యకట యేమాయె? ।మ॥ ౪

శ్రీరస్తు.

# రాజ్యలక్ష్మీ విలాసము

## కథాప్రారంభము

క. శ్రీ శైలజ శారద నై
జేశులవరవక్షపక్ష ✱ జిహ్వాగ్రలస
ద్దేశంబుల నేప్రేమా
వేశంబున నుండి రట్టి ♦ ప్రేమ భజింతున్.

శా. పాతివ్రత్య మనంగ నిట్టిదనుచుం ♦ బ్రత్యక్షముం జేయ నీ
క్షితిన్ వచ్చినరాజ్యలక్ష్మియనఁగన్ ♦ ఖ్యాతిన్ సమార్జించి సం
ప్రీతిం బచ్చనిమోము చెన్నలరఁగా ♦ వేంచేసి దేవాంగనా
వ్రాతంబుం బరితుష్టిఁ జేయుమృదు వా ♦ భావల్
మముం గావుతన్.

తే. కందుకూరి శ్రీరాజ్యలక్ష్మమనుఘనసాధ్వీచరితమ్ము
విందు సేయుఁ గద వీనుల కెంతయు ♦ వినఁగ వినఁగ
ననయమ్ము.

సీ. బహుపుణ్యభూమినా ♦ భగవంతుఁ డిడ్డన
నదులొక్కో యనుజీవ ♦ నదులచేత
సహజోన్నతికి ముఖ్య ♦ సాక్ష్య మా కదునున్న
తము లైననగులపర్వ ♦ తములచేత
విమతవితండవా ♦ గ్వితతి ఖండింప శ
స్త్రము లైనవేదశా ♦ స్త్రములచేత
పల్లవపుష్పపత్రిభా ♦ భాసురంబు లై
రాజిల్లు ఫలవృక్ష ♦ రాజిచేత

తే. గీ. శిల్పకళ నెల్లఁ దమయందు ♦ నిల్పికొనిన
దివ్యదేవాలయంబుల ♦ దీప్తిచేత
భాసిలుచు నార్యసన్మౌని ♦ వాస మైన
హిందుదేశము నెన్నంగ ♦ నెవరివశము.

వ. అందుఁ బ్రసిద్ధపరిశుద్ధోదకప్రపూరంబు లగుకాసారంబులను వజ్రవైడూర్యరత్నప్రదస్తోత్రపాత్రంబు లైన దివ్యక్షేత్రములను సకలసస్యసంభరితంబు లై యనన్యోపమంబు లైనమాన్యంబులను ద్రుమలతాఫలభరితంబు లై వివిధవిహంగవిరామంబు లైనయారామంబులను మహావృక్షసంకీర్ణంబు లై శరభశార్దూలానేకమృగశరణ్యంబు లయినయరణ్యంబులనుయాత్రికజనదురితలతాలవిత్రంబు లయినతిరుమల, కోటిఫలి, కాళహస్తి, దక్షారామము మొద లయినఁ బుణ్యక్షేత్రంబులం గలిగి యత్యంతరమణీయం బైనది యాంధ్రదేశంబుగదా?

కమాచిరాగము—ఆదితాళము

ప. సన్నుతింపఁ గాఁ దరమా సకలవైభవోపేత

ఆంధ్రమాతఁ ||స||

అ. ప. నన్నయతిక్కనపోతరాజపె • ద్దన్నలఁగన్నది యశ

ముం గొన్నది ||స||

౧. వన్నెఁ గన్నగోదావరీకృష్ణావంశధారాచిత్రావతిమొదలౌ

నెన్నఁ దగినజీవనదులచే మన కన్నము నిడి మను మనినది

కనినది ||స||

తన్నుఁగన్నత్యాగరాజగాయకుఁ దత్వశాస్త్రసంవేదియైన వే

మన్నను దూము నృసింహదాసునిఁ మాన్యచరిత్రుల

మనకైఁ గన్నది ||స|| ౨

ఉల్ల మలరఁ జేయుకవితఁ జెప్పిన మొల్లను తరిగొండ

వేంకమాంబలవల్ల నాంధ్రబాలికామణులకు నెల్లవిద్య

వాగ్భూషణ మనియెను ||స|| 3

కృష్ణదేవరాయాదిభూపతులఁ గేవలవిద్యావిభూషితులఁ

విష్ణువంశమున మన కైఁ గన్నది వేదశాస్త్రసంరక్షుల

దక్షుల|| స|| ౪

వ. ఏతదాంధ్రమహీమండలమండనాయమానం బై

చ. ధనమున ధాన్యరాసులను • దానమహత్త్వకళాసమృద్ధులఁ

ఘనతను జెంది యాంధ్రులకుఁ•గల్పకమట్టుల దోడునీడ యై

జనసుతిఁ గాంచి కీర్తి సువి • శాలత దిక్కుల నావరించి వృ

ద్ధినిఁ గనుచున్న రాజ్యమని • తెల్పఁ బిఠాపురరాజ్యమే తగుఁ.

తే. గీ. ఆంధ్రలక్ష్మీగళస్థిత • హారదీప్త
మైనయాణిముత్యంబులే • యన్నియూళ్ళు
రావువారివి యని వేరె • వ్రాయవలెనె?
చెప్పకయె చెప్పు నవి గొప్ప • సిరిని గలిగి.

తొ. ఈరాజుల యేలుబడికి లో నై యింపుమీరఁగా తేరు
శ్రీరాణ్మందిరవరసమీపమునఁ • జిత్ర మైనపల్లెటూరు.

సీ. పత్రసమాచ్ఛాద • భాసితగేహముల్
మౌనివాసంబుల • మాడ్కిఁ గ్రాల
క్షీరసంతప్తాగ్నిఁ జెలరేగునాపొగల్
హోమధూమంబుల • హొయలు దెలుపఁ
బనిహుషారుకోలందిఁ • బాడెడుపాటలు
వేదఘోషములఁబోలె మోద మొసఁగఁ
బరిసరంబుల మేయు • వరగోసమూహమ్ము
లాశ్రమధేనువు • లటుల మెఱయ

తే. గీ. వృక్షములనెక్కి యాడెడు • పిన్నవాండ్రు
మునికుమారులలీలల • ముద్దుగొలుపఁ
దేరిచూడఁగ మునిపల్లె • తీరుఁ గేరి
తేజరిల్లుచునుండుఁ గా • తేరుమూరు!

తొ. పాతియున్నఁ జిత్రాంగిరాయి యిప్పటికిని జెదరకయుండెఁ
ఖ్యాతిఁ గన్నసారంగధరునినిజ • కథకుఁ జిహ్నమును
చుండెఁ

తొ. అచటి తరువితతి నేత్రానందం ♦ బై రహిమీఱుచుఁ
గనఁగ

సచరాచరకర్తృసృష్టిచిత్రముఁ ♦ జాటుచుండె నో
యనఁగ.

తొ. హరిహరులకు వైరుధ్యము లే దని ♦ స్థిరపఱచుటకో
యనఁగ

హరిహరాలయము లొక్క-తావునను ♦ యచట నుండెఁ
గనుఁగొనఁగ

తొ. ఆతటాకమును నావటభూజము ♦ నందముగాఁ
గనుపించుఁ

జేతోమోదము నొసఁగి పాంథులకు ♦ శీఘ్రమె శ్రమ
వారించుఁ.

తొ. రాజన రేంద్రుఁడు ద్రవ్యించిన ని ♦ ర్మలసలిలపుగూపమ్ము
ఊరివారలకు నన్యులకును గను ♦ నుపయుక్తం బగుసుమ్ము

తొ. అచటనుండి రద్దంకివారు నా ♦ న్నాఱువేలవారు
సుచరిత్రుఁడు పట్టాభిరాముఁ డను ♦ సుజనహితుఁడు
దనరారు.

తొ. అతఁడు కొండమాంబను నామెను ని ♦ ల్లాలుగాఁ
గలుగువాఁడు

అతిశిష్టాచారంబున నతిథుల ♦ నాదరించువాఁడు.

కమాచిరాగము—ఆదితాళము.

ప॥ భవం బొందె నాచోట, (ఘనప్రా)

అ॥ ప॥ భవం బాంధ్రులకు ధ్రువంబు సేయఁగ ॥భ॥

చ॥ భువిఁ వితంతుల యపూర్వశోకము దివిఁ జొరఁగ విన లేక
దేవతాసతులు గన లేక యది నివారించి త్రిలోక
మున కవంద్యసుగుణానీక మను భవంబుననుఁ బ్రత్యేక
ముగ నివేదించుమనిదివిన్ విధించిన నవాంధ్రశిశు వన॥భ॥
భరింపఁ జాలను శిశునివాంతరిలను భరింపలే నని భూమి
యావిరించితో యోసామి నిన్ గురించి యిదె ప్రణమామి!
యేమతింబియుండఁగ నేమి కనికరించు సత్పథగామి!
యన విరించి యందుల కేమిరి యవ
తరించు నొకసతి భయ మేమి? యన॥ భ॥ ౨
పరాత్పరుం డీతెలుంగుదేశపు దురాచారముం గాంచి
ముఁక పరాకుసేయుట మంచి గా దురా యనుచు మది
నెంచి హై సరే నేను జనుదెంచి యది నిరాకరించెద
మించి త్వరన్ ర మ్మనిన గిరీశసుత యన॥ భ॥

తో. అమ్మలు నక్కలు సందఱుఁ జూచి గుమ్మడిపండే యనిరి
సమ్మద మొదవఁగఁ దమదమపనులకు సత్వరమ్ము గాఁజనిరి;

తే. గీ. ఆమెవర్ధిల్లి యాంధ్రులం ♦ దగ్రగణ్య
మైనస్థానంబునందున ♦ నధివసించి
మించు సత్కీర్తి చే దిశల్ ♦ ముంచు ననుచుఁ
దలఁప లే రైరి ధావిఁ ♦ [illegible] దరమె?

తో. ఆముఖ వైఖరి ఆనయనంబులు ♦ నాయవయావసౌష్ఠవము
ఆముద్దునగవు లాకదలికయును ♦ సద్వృత్తచిహ్నాలె ధ్రువము.
తో. అని యానాఁడాలోకులందఱునుఁ♦గొనియాడినయామాట
ఘనం బైనయాశీర్వచనం బై క ♦ లిగె ఫలము నానాట.
తో. బుగ్గలు నులుమఁగ నుగ్గును బాఁపుచుఁ ♦ బొరలపొరలఁ గ్రిక్కచును
దిగ్గునలేచుచు మఱలం బడుచును♦దెలివిమీఱ నవ్వుచును.
తో. ఉయ్యేలలోపల నుంచి పాడఁగా♦నుత్సాహముతో వినును
పయ్యెదఁ బట్టుచుఁ బ్రాకులాడుచును ♦ బాలిమ్మమ్మని యనును.

తే. గీ. అకట యిటువంటి శైశవం ♦ బైనఁ గాని
జరుగకయు మున్నె జనుఁ డెంత ♦ సాహసుండొ
తల్లి నెడఁబాపె మోహాల ♦ తల్లి కకట!
వానిపుట్టిమునిఁగెనో ♦ కానరాదు.

—అసావేరిరాగము—మిశ్రగతి—

ప॥ జనని లేకపోయెఁ గా మనచిట్టితల్లికి॥ జ॥
అ॥ ప॥ ఘనసేవకై భూలోకమున కరుదెంచిన॥ జ॥
చ॥ పనిఁగొని యెంత ప్రొద్దులు పాట్లఁ బెంచినఁ గాని
జనని పోషణమునకు సాటి యౌనె భువిని॥ జ॥
౨ కంటికి రెప్ప యై కాచు చుండుచు సదా
అంటి యుండి భూమికం టె నోర్పును జూపు॥ జ॥

3 అక్కునఁ జేర్చి ముద్దాడి ప్రేమముమీఱఁ
జెక్కిలిఁ గొట్టుచు శిరమును మూర్కొను॥ జ॥

తో. తల్లినిబోలినదింకొక పెద్దియు♦ధరణిలోపలఁ లేదుకదా?
తల్లి లేనిపిల్లలన్న నందఱు♦దయతోఁ జూచుటకలదుకదా?

తో. తల్లిలేనితండ్రి యెట్టులుండునో ♦ తజ్ఞుల కది విశదంబు
తల్లి లేనిచోఁ దండ్రియు లేఁడని♦తలఁతురు జనులునిజంబు.

తే. గీ. అంతఁ జింతించి బిడ్డ మే ♦ నత్త మేన
మామ లిద్దఱుఁ గన్నకొ ♦ మార్తె యనుచు
నెంచి పెంచంగఁ దొడఁగి ర ♦ హీనమతిని
దమకు బిడ్డలు లే రన్న ♦ తలఁపు దొలఁగ.

తో. కన్న కొమారితకంటె నధిక మగా ♦గారాబమ్మునఁ బెనిచి
వెన్నప్పమువలెనుండి యున్నదనఁ♦బ్రియము బడికిం బనిచి.

తే గీ. ఈప్సితార్థంబులం దెచ్చి ♦ యిచ్చినారు
మంచిమాటలఁ జదువు చె ♦ ప్పించినారు
తెలివితేటలు గలుగంగఁ ♦ దిద్దినారు
ఆడపిల్లకుఁ జదు వెందు ♦ కనక వారు.

తో. అలవేయేండ్లకు నెన్నవయే డని ♦ కలజనులందఱు నాడ
పరమేశ్వరకృపవలనఁ గన్యకు ♦ వచ్చెఁ దొమ్మిదవయేఁడు.

తో. ‘‘తల్లి లేనిపిల్ల దీని కకటా! ♦ తగినభర్తఁ దేఁ గలమా!
ఉల్లంబొప్పదుసామాన్యునిఁగన♦నౌనరఁగ వెదుకంగలమా!

తో. అనుచు దంపతులా యిష్టదైవముల ♦ నతిభక్తిని బ్రార్థించి
ఘనకందుకూరివంశజుఁ డుండుట♦మనం బలరఁగ్రహియించి

వ. పరస్పరావలోకనసంభాషణాది సముచితగౌరవం బులు జఱిగిన పిదప,

తే. గీ. గురుముఖంబునఁ బెండిలిఁ ♦ గుమరుపఱిచి
విందు నొనరించి కడు గౌర ♦ వించి మఱియుఁ
దఱలి రమ్మని తెల్పి ప ♦ త్సాహపడుచుఁ
బెండ్లిపెద్దలు దద్దయుఁ ♦ వినయమొప్ప.

తొ. తథాస్తుతథాస్తు తథాస్తటం చాశతఱిచొకపంచాంగమును
ముదం బలరఁగాఁ గనుగొని రం దొక ♦ ముఖ్య మౌ ము
హూర్తమును.

తొ. అది పమనెనిమిదివందలయిరువది ♦ పై నొకసంవత్సరము
ఇదిహూణశకంబునసై యొప్పును ♦ ఇతరముకుదురదుతిరము.

వ. ఒక్కసుముహూర్తమ్మున వధువును బెండ్లికొమా ర్తెంజేసి ముద్దుముచ్చటలం జఱిపి నవీనదుకూలాభరణాదుల గౌరవించి యలంకరించి పసపుఁగొట్టి పాటలం బాడిసువాసినీ మణు లందఱుం దల్లి లేనిలోటు గానరాకుండ హృదయపూ ర్వకమ్మున నాశీర్వదించి యాదరించి తమతమనిలయములకుం జన నాఘూడవనాట మహావైభవమున రాజమందిరమునుండి తఱలివచ్చిన శ్రీపంతులవారికి వేదమంత్రపూర్వకముగ వివిధ వాద్యవిశేషంబులు భూనభోంతరాళంబులు మాఱుమోయ బ్రాహ్మణాశీర్వాదంబులు సెలంగ గణికలు నర్తనము సేయ ధర్మపత్నీసమేతమ్మున నాపె మేనమామ సాలంకృతకన్యా దానం బొనరించి పరిణయముఁ గావించె.

హిందుస్థానిభైరవి—చతురశ్రగతి.

ప॥ ఆపెండిలి నెన్నఁదరమా॥

అ॥ ప॥ ఆపద్మజున కైన నాదిశేషున కైన॥ ఆ॥

౧ చ॥ ఆపందిరి ముస్తాబుతీరు నా బాపలమంత్రాలసారు
నాపుణ్య నారులబారుమే లీ పతిదగునసువారు॥ ఆ॥

౨ వారనారులమేలైనపాటలు శృంగారరసమొప్పు నాటలుసభ
వారిసరసంపుమాటలు ఏపారు యువకుల యూగులాటలు॥

3 పెద్దపాగాలసన్నాయగాళ్లు విద్దెనార్జించిన డోలుగాళ్ళు
నద్దిరా యనఁదగు తాసజోళ్ళుఁ తుర్యద్దండమారామడోళ్ళు
గల॥ ఆ॥

తే. గీ. ఈకుజోడైన పెండ్లిండ్లఁ ♦ జూడఁ దగును
గాన నీపెండ్లి నంద ఱుఁ ♦ చి సంత
సించి దీవించి మతిఁజను ♦ దెంచువారు
లోక మద్దమె యనుమాట ♦ రూఢిరూఢి.

తొ. లోకసమ్మతిం బగునాపెండిలి ♦ లోకమునకు సుఖదమ్మ
గాకయుండునే యాచంద్రార్కముఁ♦గలుగఁజేసెనుశుభమ్ము.

వ. శుక్లపక్షసుధాకరరేఖయుంబోలె దినదినప్రవర్థమానయై సహజసౌందర్యమునకుఁ దోడు సంప్రాప్తయౌవనభాగ్యమ్మున ద్విగుణీకృతలావణ్యయై కలకలలాడునెమ్మొగమ్మును మృదుమధురంబులైన పలుకులం గలిగి యుత్తమస్త్రీలక్షణంబుల నొప్పి చక్కని వారిలో నేరికిం దీసిపోవక మతియొ శవాసి మించుచుఁ దోడిచెలికత్తెలయుం దీడు లేని తెలివితేటలం

గలిగి గృహకృత్యములను విద్యావిశేషమునను గదలికం గలిగి మెలంగుచుండె నంతట.

తో. ఒకసుముహూర్తంబారసియిరువ్వుర ♦ నొక్కటిగాఁజేసి
సకలవిధంబులబంధుమిత్రులఁ బ్రి ♦ శస్తగౌరవముఁజేసి.

తో. పతిమాటకుజవదాటకెప్పుడును ♦ బరాకుఁజెందకుమీనుము
పతితోడుతఁగలసి మెలసియుండుము ♦ పాతివ్రత్యముఁగనుము.

తో. బెంగనుగుంగకయుండఁగదమ్మ ♦ పెంచినప్రేమమునెంచి
మంగళవతివై యుభయకులములకు ♦ మహితయశోవెంచి.

తో. అనిమోదారిచి యటుపిమ్మట మన ♦ యాంధ్రికవీంద్రుని జూచి
వినయంబున నిట్టులనియె వెన్నెటి ♦ వేంకటరత్నము లేచి.

తో. అఱచేతిలోనిదిమ్మపంపుఁబలెనే ♦ యాదరించిపెంచితిని
ఎఱుఁగదు గడుసుందనమేమియునిది ♦ యేలుకొమ్మ దయామతిని.

తో. తల్లి లేనిపిల్లయన్నమాటను ♦ దప్పకుండనెదనుంచి
చల్లనిచూపులఁ జూచుకొనుము వర ♦ సాధ్వియనుచు మదిఁదలఁచి.

తే. గీ. అనుచుఁ దొలుసారెఁ బంపించి ♦ రప్పుడామెఁ
గన్నకొమరితకంటె న ♦ గౌరవముగఁ
బసపుఁగుంకుమమునూతన ♦ వసనములను
మంచిమంచము నితరసా ♦ మగ్రి నిచ్చి.

తొ. తలలో నాలుకఁబలెనే తనయ ♦ త్తవారియింటను గలసి
మెలసిసాటివారిలోననయమున ♦ మించుటపిజలకుఁదెలిసి.

తే. గీ. అమ్మ మణిపూసరాజ్యల ♦ క్ష్మమ్మ యనెడి
మాట యింటింట ఱోకంటి ♦ పాట యయ్యెఁ
బాపపుణ్యంబులను దెల్ప ♦ భారమెల్లఁ
బిజల దనుమాట సర్వదా ♦ నిజము నిజము.

తొ. అప్పటికప్పడెవంతులవార ♦ లాంధ్రిభాషలోఁగవితఁ
జెప్పటఁబ్రారంభించినవారఁట ♦ చిరకాలసుకృతఫలిత.

తొ. మునయ్యారే! యని పండితులన ♦ బుద్ధివిశేషముఁజూపి
మనవారంపఱుఁ బాగదునట్లుగా ♦ మధురపదమ్ములందాపి.

వ. ఇది యిటు లుండ నప్పటిదేశస్థితి యెట్లున్న దన?

సీ. బాలికలకు విద్య ♦ పనికి రా దని మాన
పత్రికలకు వ్రాయుఁ ♦ బండితాలి
యధికారిధర్మమం ♦ చదరు బెదరు లేక
లంచముల్ గ్రహియించు ♦ లౌక్యచయము
నొకవేశ్య నైనను ♦ నుంచకుండినఁ బేరు
రాను రా దనున్యాయ ♦ వాదివితతి
ధనము లాగెడుకుతం ♦ త్రము లవలంబించి
పిజల పైఁ బడుభూత ♦ వైద్యగణము.

తే. గీ. గర్భవతులను శిశుహత్య ♦ కారిను లగు
విధవలను గల్గి లవ మైన ♦ వెలుపు లేక
కాదు కా దనువారలఁ ♦ గానరాక
యెటుల నుండంగ వలయునో ♦ యటుల నుండె.

తో. అట్టిస్థితిం గని మనకవీంద్రుఁ డ♦హా యని విచార మంది
దిట్టరియై తనయభిప్రాయములఁ ♦ దెల్పనిశ్చయతఁ జెంది.

తో. నడుముఁగట్టి యుద్ధభూమిలోపల ♦ నడుగిడిగిరివలెనిలిచెఁ
వడివడి శత్రువులెందఱు దనపైఁ ♦ బడినను జడియక
పెలుచఁ

తో. వివేకవర్ధనీపత్రికాస్త్రమును ♦ విడుచును నెలకొకసారి
వివాదపక్షులు మూర్ఛనొందఁగా ♦ వింతసంగతుల నేరి.

తే. గీ. కడచె నీయుద్ధ మొకకొంత ♦ కాల మిట్లు
ఘర్షణంబునఁ బ్రజలు మే ♦ ల్కాంచునట్లు
చేత లేనట్టి యీవట్టి ♦ వ్రాఁతవలన
ఫలము లే దని తానొక్క ♦ ప్రతినఁ బూనె.

తో. అదియెవితంతూద్వాహవిషయమని♦యనవలెనెల్లరకున్
విదితమై జగత్ప్రసిద్ధమైనది ♦ వింత యేమి నేఁబలుకఁ.

తో. ఆసంస్కారము సంఘములోపల ♦ నాచరణకుఁ బురికొలుపఁ,
వ్యాసమ్ములు విరచించి లసదుప ♦ న్యాసమ్ములు సలుపఁ.

కన్నడ—చతురశ్రగతి.

ప॥ ఆకర్షింపఁగాఁబడిరి యనేకు లందలిసత్యముఁ గనుఁగొని॥ఆ॥

అ॥ ప॥ ఏకర్మము నెఱుఁగనిపసికూనల కెంతకాల మిటు గొంతుగోత లన॥ ఆ॥

చ. లోకజ్ఞానం బొకకొంచెము రాకమున్నె కేవలము నవివేక
వివాహములను దయలేక చేయఁ బతులు పోవఁగ శోక

మును జెంది వయఃపరిపాకమున మనసు నిల్పగాఁలేక
వ్యభిచారముఁ జేసి యనేకబాధలఁబడు చే లనంగ
మాటరాక యుక్తి లేక॥ ఆ॥

ఉ. అంతట నాంధ్రదేశఁపుమ ♦ మహాత్ములుగొందఱు పండ్లఁ గీటి మే
లెంతటివింతవుట్టె మన ♦ కీగతి వచ్చెనె నేటి కన్యన
త్యంతమహాగ్రహోగ్రు లయి ♦ యాఱడి వెట్టుచుఁ జాలఁ దిట్టుచున్
బంతముఁబూని రీక్రృషినిఁభగ్నము సేయఁగ గుంపుగుంపులై.

తో. మార్కండేయాఁయమ్మునకు మే♦ముఱుగుఁదెంచుచున్నాము
కోర్కెదీర వాదింపఁగ నచటికిఁ ♦ గూడుచు నున్నాము

తో. రండురండు మీవాదమునిల్పఁగ♦రం డాదిశకిఁక త్వరగన్
నిండుసభను దేలఁగవలె నందలి ♦ నిజం బేమొ పఱఁగన్.

ఉ. వచ్చిరి రాజమందిరస♦భాపతులున్ మఱిఁబండితోత్తముల్
వచ్చిరి న్యాయవాదులును♦వర్తకులున్ గులవృద్ధులందఱున్
వచ్చిరి దుండగీడులును ♦వచ్చిరి గొందఱు సత్యసంధులున్
వచ్చిరి యబ్రమేమి? యటు ♦ వంటి మహామతగోష్ఠిఁ జూడఁగన్.

తో. ఉభయపక్షములవారును వాదము♦లొప్పిదముగఁ గావింప
సభలోఁ గొందఱసూయాపరులై♦సాహసించి పరిహరింప

తో. తలఁచియుండ నింగ్లీషుచదువు వి♦ద్యార్థులెల్ల గ్రహియించి
నిలిచిరి ప్రాణము లర్పించుటకై ♦ నిజగురురక్షణ నెంచి.

తొ. భీతిఁ గొల్ప యమదూతలవలెఁ దమ♦లాఠీలను ధరియించి
యేతటి నెవ్వరు గురువుపైనిఁ జే ♦ సెదరో యని తిలకించి.

తే. గీ. కొదమసింగంబులంబలెఁ ♦ గూరుచుండి
యుంట నాదుండగీడులు ♦ గంటఁ జూచి
సాగ దిప్పుడు మనయాట ♦ సాగ దనుచు
మెల్లఁగా జారినా రఁట ♦ తెల్లవోయి.

తొ. అపుడు రాణ్మహేంద్రివరంబంతయు ♦ నట్లుడికినట్ల యుడికెఁ
యెపుడును గల్గనిసంక్షోభము జని ♦ యించెఁ గులగిరులు వడఁకన్.

శా. ఈకల్లోలమునంతయుఁ వినుచుఁ దా ♦ నింతేని మాంద్యో ఖముఁ
లే కుండెఁ మనరాజ్యలక్ష్మి భళిజా♦లించెంది యో లేక సు
శ్లోకుండాపతిపూన్కి మంచిదని యో♦లోకోపయుక్తంబె యిం
గేకీడుం జొరనీడు దైవ మని యో ♦ యేయూఁత లొ సెం చియో.

తొ. అమ్మా! జనసంక్షోభముఁ గలిగిన ♦ యత్నమ్మిది వలదనుము
ఎమ్మెయిన్నేదురాత్ములు నీవిభు ♦ నేమిచేయుదురో కనుము.

తొ. ఇంతకు మీకే బాలవితంతువు ♦ నేడ్చుచునున్నది లేదు కదా?
చింతిలనేటికిలోకులకో ఆకై ♦ పంతము బూనుటవలనువృథా.

తే. గీ. అనుచుఁ దనవార లెవ రైన • ననిన యపుడు
భర్త కేదురాడ నని నవ్వి • పలుకఁ గాని
మీఱు లనినది నిజ మని • మిట్టిపడుచు
భర్త నెదిరింప దెప్పు డా • పరమసాధ్వి.

తొ. ధనమిడఁ బైడా రామకృష్ణయను•ధన్యాత్ముని జూపించె
ఘనుఁ డారక్షకుఁ డెఱుఁగని దెయ్యది • కానుపింప దూహించన్.

తొ. భావికార్యశుభసూచనమని యనఁ•బాఠశాల విద్యార్థుల్
తోనివఁ ద్రొక్కుదుము మేమిదే యనిరి•కేవలసుసమర్థుల్.

తొ. వివాహాశఁ గలవితంతుకన్యల • వెదకి వెదకి వేసారి
విరోధమ్ములకు వెనుకందీయక • పెద్దాపురమును జేరి

తొ. అష్టకష్టముల వితంతువుం గన • నర్థరాత్రిమున లేచి
స్వప్నపటిచి తమరాక నెటులనో • పల్లకిలోఁ బడవైచి.

తొ. మఱునటిప్రొద్దున కామెఁ దెచ్చి రఁట • మనరాణ్మందిర వరము
ఎఱుఁగరు రెండవకంట నెవ్వరును • నేమని చెప్పఁగలము.

చం. ఘనమగుశ్రిద్ధయుట్టిపడఁ•గష్టమునన్ వరుఁబట్టిస్వీయమా
ధనమును వెచ్చఁబెట్టి రిపు•ధాటి కభేద్యపుఁకూఁకఁబెట్టి దు
ర్జనములఁగూలనెట్టిపరిజ•లందఱుఁదిట్టఁగఁగొంగుఁ బట్టి పూ
నినపని జక్కఁబెట్టి మహా•నీయులచెంత నజేయుఁడై భళీ.

తే. గీ. కత్తిపోటును మించునఁ • గలముపోట
టంచుబుధు లన్నమాట య • థార్థ మయ్యెఁ

గత్తు లెందఱు దీసినఁ ♦ గాని తుదకుఁ
గలముఁ జేఁబూని యొక్కఁడై ♦ గెలుచుకతన.
తే. వీరుల కీశుం డనఁదగు నీతని ♦ ధీరపద్ధతినిఁ గనఁగన్
పేరుసార్థకముఁ జేసికొనెను దన♦పెద్దలనుడి నిజ మనఁగన్.
వ. ఇంటఁ బ్రథమవితంతూద్వాహము జరుగునప్పుడు
మన రాజ్యలక్ష్మమ్మ యెట్టిధైర్యమును జూపెనో చూచితిరా?
ఉ. భర్తను దూఱలే దిట వి♦వాహము వల్దని చెప్ప లేదు తా
నార్తినిజెంద లేదు తన♦యత్తను మామఁదలంపలేదు పెఁ
గీర్తిని గోరలేదు పర ♦ కీర్తనలన్ విని యుబ్బ లేదు స
ద్వర్తనమన్న నట్టిది క ♦ దా జగతిన్ బదివేలయేండ్లకున్.
తో పతినిన్ మించినయుత్సాహముతోఁ♦బట్టుచీర ధరియించెన్
గతసాధ్వసయై యథావిధముగాఁ♦గన్య ధారవోయించెన్.
తో. ఓమ్మట నూరేగింపుటుత్సవము♦వింతగొల్పఁగా జఱుఁగన్
అమ్మహోత్సవముఁజూడలేమి జను♦లందఱుబల్లకివిఱుగన్.
తో. రాల రువ్వ నధికారులు గడునా ♦ ర్భాటముతో వారించి
పాలకశక్తినిఁ బ్రకటనఁ జేసిరి ♦ పట్టుదలను వహియించి.
తే. గీ. అట్టియాందోళసమయమం ♦ దైనఁ గాని
యయినయుద్వాహ మెట్లయిన ♦ నవ్యే నింక
మఱలుకొం దని పల్లెత్తి ♦ మాటలాడ
దహహ యేమందు మాయధై ♦ ర్యంబుమహిమ.
కమాచిరాగము—చతురశ్రగతి.
వ॥ ఆసుగుణవతిని వర్ణింపనాతరమా॥

అ॥ ప॥ వీసమైనఁగోపంబు లేదు పతిచేసినపనికడ్డంబురాదు॥ అ॥

౧ చ. వన్నెఁ దెచ్చెఁ బుట్టినయింటికి మఱి వాసిదెచ్చె మెట్టిన
యింటికి నీయున్నలమిన్నను బోలుభార్యఁ గల
యాతఁడె పుణ్యాత్ముఁ డని రందఱు॥ అ॥

౨ సంతతి లేమికిఁజింతనొందదు వితంతువులనుగన్న కూతులంబలె
నెంతోదయాన్వితమతితోఁజూచును నింతైనవిసుఁగు జెంద
దెప్పుడు॥ అ॥

3 కులములోన నేమిచిక్కువచ్చునో కలమచుట్టము లేమిచేయ
నెంతునో
కులస్వామియాంతఁ యేమివచ్చునో తలఁపక పతినే నమ్ము
కొనెను॥ అ॥

వ. జే! ఆంధ్రమాతకు జే! ఆంధ్రనాశిమణులకు జే!

తో. ఆవివాహమెప్పుడు జరిగినదో ♦ ఆంధ్రదేశమానాడె
దేవునికృపనూతనాశయములను♦ తెరువుఁదొక్కఁగనెచూడ.

తో. ఆతతిఁబారులు స్వామికివిన్నప♦ మంపఁగ వారదిచూచి
చేతనైనపత్రికలంబంపిరి ♦ శీఘ్రముగాఁ దలయూచి

తే గీ. స్వాములకు నెల్ల స్వామి యా ♦ స్వామిఁ జూచి
యాంతఁపత్రికలకు నాంతఁ ♦ యనుచు లేచి
పట్టువిడువనిపతికిఁ దో ♦ డ్పడుచు నుండె
రాజ్యలక్ష్మమ్మ స్త్రీలోక ♦ రత్న మనఁగ.

తో. బంధుగులందఱుఁజిక్కు పెట్టునా♦బాధకుఁదాళఁగలేక
కొందఱుముఖ్యులె ప్రాయశ్చిత్తముఁ♦ గోరుకొనిరి విధిలేక.

తో. ఒక్కఁడుమాత్రిమె యాడితప్ప నని ♦ యుండి గౌరవముఁ
దెలిపెఁ
జిక్కుల నన్నిఁటిఁ దృణప్రాయముగఁ ♦ జేసి సత్యమును
నిలిపెన్.

తే. గీ. ఆగవత్తాజు నుతియింప ♦ నలవియౌనె
యనుచుఁ బంతులవారె తా ♦ మనినయపుడు
స్వీయచారిత్ర పాటులనే ♦ చెప్పినపుడు
పలుక నేర్చునె నావంటి ♦ పామరుండు.

వ. ఈమహాశయుని గౌరవరా జని పిలువం దగునుగదా?

తో. అతఁడు హరిశ్చంద్రాదులఁ బోలిన ♦ యట్టిమహాత్ముఁడు
ఘనుఁడు
అతిదయాన్వితుం డాపద్బాంధవుఁ ♦ డనం దగినసజ్జనుఁడు

వ. తన్నుం బ్రోత్సాహపఱిచి పలికిన పలువురు మిత్రులు ధైర్యంబు నిలుపనేరక సంఘసంస్కారదీక్షావిముఖులయి ప్రాయశ్చిత్తంబులఁ గావించికొనినను దామమాత్ర మా మాటకుఁ జెవి యొగ్గక ద్విగుణీకృతోత్సాహమునఁ గార్యపరతంత్రులయి యుండిరి. అప్పటి కాంధ్రదేశము సంస్కారపక్షుల కేమైన సాయపడు చున్నదా కటకటా!

సీ. బాలవితంతుల ♦ పరితాపమును విని,
నిలువనిచ్చుట కైన ♦ నీడ లేదు
తల్లిదండ్రులు లేమి ♦ నల్లాడుబిడ్డల,
సుఖనిద్ర కైనను ♦ జోటు లేదు

జాతీయపద్ధతిఁ ♦ జదువు నేర్చుకొనంగ,
నను వైనవిద్యాల ♦ యమ్మ లేదు
ప్రాచీనవైద్య ప్ర ♦ భావమున్ గ్రహియింప,
నిమ్మైనయొకయాశ్రి ♦ మమ్ము లేదు
ప్రకృతిశాస్త్రము మాతృ ♦ భాషలో వెలిఁబుచ్చు,
పీఠైనయొకగ్రంథ ♦ మాల లేదు

తే. గీ. అటుల నున్నదియెవ్వటి ♦ కాంధ్రమాత
వెనుక కొకసారి దృష్టిని ♦ బనుపరయ్య
యట్టిస్థితియందు సంస్కార ♦ మన్న నెంత
కష్టమో కష్టతమ మౌనొ ♦స్పష్టపడును.

తే. గీ. పసపుఁ గుంకుము లే కుండ ♦ బ్రహ్మ వ్రాయ
వాని వ్రాఁతకుఁ బ్రతిగాఁగ ♦ వ్రాసినాఁడు
పలుకవచ్చును నూతన ♦ బ్రహ్మ యనుచు
నన్నగసాగిరి ప్రజ లెల్ల ♦ నష్టమైన
వాణి యనవచ్చు నీతని ♦ రాణి నహహా.

తో. ప్రతికక్షులు నీళ్ళుమోయువారినిఁ ♦ బాఱిపోవ బెదరింప
నతికష్టమ్మన నీళ్ళుమోసెదన ♦ పతిప్రతినను జెల్లింప.

తో. కష్టమనక పతితోడ నెయుండెను ♦ గన్యధారలన్ వోయు
చును
ఇష్టమ్మనగర్భవాపమనఁగా ♦ నెంచివితంతులఁబోర్చుచుచును

తో. ఇటులనేకమా వివాహములఁజే ♦ యించెఁ బతికిఁదోడై
కుటిలత్వంబనునది మొఱుంగక ఋషి ♦ కులస్త్రీల కీడై

తొ. పంతులవా ర్జన్నిదమ్ములఁదీసి ♦ బ్రాహ్మమతమునంజేరఁగ
బంతగించి వలదనినివారింపదు ♦ పతియిష్టమునుం గోరుఁగ.
తొ. ఆ స్త్రీనెల్ల ధర్మమ్ములఁజేసెనఁట ♦ అయ్యోవింటివటమ్మ
నా స్త్రీవచనమే నీకుమిగులునఁట ♦ నాయమాయడుగవమ్మ.
తే. గీ. అనుచుఁ జెలిక త్తె లెవ్వరైన ♦ ననిన యపుడు
పరులగష్టమ్ముల దీర్పఁగాఁ ♦ బాటువడెను
భ ర్త తన ప్రాణసఖి కొఱకె ♦ పట్టెడన్న
ముంచి యుంచఁడె పోనీయుఁ ♦ డుంచకున్న.
తొ. అని విరాగమును జూపుఁ గాని యా ♦ నౌను నాగతేమనదు
తనపతినీవిషయంబై యడుగఁగఁ ♦ ద త్తరపడిచనదు.
తొ. పంతులవా రాదానసమయమున ♦ భార్యమాటనేమఱిరా?
యెంతమాత్రమును మఱవ లేదు వ్రా ♦ యించిరి బుధులౌరా?
తొ. యనందగిన మాసవేతనమును ♦ సర్హమైన గృహము
ఘనంబుగా నిర్ణయించియుంచిరి ♦ కనుపింప ననుగ్రహము.
తే. గీ. తామె తొలుదొల్త హరిసన్ని ♦ ధానమునను
జేరఁ గల వాని యీరీతిఁ ♦ జేయవచ్చుఁ
దిఱుగు మా టౌ నటంచును ♦ దెలియ రైరి
యీశ్వరాజ్ఞను దెలియఁగా ♦ నెవరితరము.
తొ. చిరకాలంబీరీతి నిరువురుఁగ ♦ స్నేహభావముననుండ
తిరువాతను దామెప్పటివలెఁజని ♦ తమసౌధమునఁబరుండ.

తే. గీ. కడచె రేయెల్ల నాయుషః ♦ కాల మయ్యెఁ
బ్రార్థనమునకుఁ దరి యయ్యెఁ ♦ బాప మామె
లేవ లే దయ్యెఁ గత మేమొ ♦ లేవకున్కిఁ
గనఁగ మంచముకడ కేగెఁ ♦ గవివరుండు.

తో. పరుండి లేవనిసతిని గనుంగొని ♦ పలుకరించెఁ గడసారి
పరుండి యున్నది యనియెడుభ్రాంతినిఁ ♦ బరమవృద్ధుఁ డొకతూరి.

తో. మాఠాడమిఁ గని గాఢసుషుప్తిని ♦ మగ్న యయ్యె నని యెంచి
చాలవఱకు వేచియుండి లేచెను ♦ జాడ లేమిని గ్రహించి.

తో. కదల్చిచూడఁగఁ జేయివైవఁగాఁ ♦ గలువకాడవలెనుండ
నిదేమియని నదువంగాళ్లాడక ♦ యెట్టిటో సాధమునుండి.

తే. గీ. దిగువఱ్ఱ దిగి యీస్థితిఁ ♦ దెలిపి వేగ
వైద్యునిం దోడితెమ్మని ♦ పంపఁగాన
మందుబుడ్లను గొనివచ్చె ♦ మాటలోనె
కాని యుపయోగపడుస్థితి ♦ గడచిపోయె.

తో. అతఁడు పరీక్షనుజేసిచూచి య♦ య్యయ్యోయనిచింతించి
యతులదుఃఖదం బగునామాటను ♦ ననలేకయె వివరించి.

తే. గీ. పలుక పిన లేక పంతుల ♦ వారలపుడు
యీశ్వరా! యెంతపనిఁజేసి ♦ తే యటంచు
క్షణములోపల మేటివృ ♦ క్షమ్ముగూడ్కి
నేల కొఱిగిరి దుఃఖాన ♦ నిలువ లేక.

తో. ఎట్టకేలకాపరమేశుని దయ ♦ నెట్టెటో మెల్లఁగలేచి
గట్టిఁజేసికొని మానమును సిగ్గును ♦ గల కళేబరముఁ
జూచి.

తో. పట్టణమునఁ గలమహాజనుల కీ ♦ వార్తఁ దెలిపిరమ్మనఁగ
నట్టియొనర్చిరి కొందఱాతిజీవి ♦ నందఱు శివశివ యనఁగ
తో. అప్పటినుండియుఁ దోటకడకు జను ♦ లందఱు రామోద
లిడిరి
చెప్పశక్యమా వివిధమతమ్ముల ♦ స్త్రీపురుషులు గుమిఁబడిరి.

సీ. గర్భవాసముకంటె ♦ గారాబమునఁ బెంచె,
నీయమ్మ మమ్మని ♦ యేడ్చువారు
కళ దొలంగఁగ లేదు ♦ కంటిరే? యనుచును
గన్నీటిధారలఁ ♦ గార్చువారు
నక్కతో మాటాడ ♦ వా యింక మాతోడ,
మంచియే యనుచుఁ జిం ♦ తించువారు
తలపూవు వలువయు ♦ నలుగక తొలఁగక,
భాసిల్లు ననుచును ♦ వగచువారు

తే. గీ. లెక్క లే కుండ నిండిరి ♦ లిప్తలోన
నామె పావనసుచరిత్రి ♦ యాటఁ జేసి
పనుల విడనాడి మతముల ♦ పట్టు వీడి
దేశబాంధవఁ గా నెంచి ♦ దివ్యమతిని.

ఓసత్యస్వరూపా! నిత్యప్రదీపా! సత్యప్రతాపా! జగజ్జే
గీయమాన మైననీశక్తి యనంతము. ప్రభూ! నీవు కాలము

ననుసరించి మార్పులను గలుగఁజేసి ధర్మసంస్థాపనార్థ మై మాకు మహాపురుషులను సాధ్వీమతల్లులనుఁ బ్రసాదింపుచుందువు. నీవాత్సల్యము వర్ణనాతీతము. నీకరుణ మహాసాగరము ప్రభూ! నీరాజరికమునం దనంతకోటిబ్రహ్మాండము లున్నవి. అందు భారతదేశాంతర్భాగమున నాంధ్రరాష్ట్రమున బాలవితంతువులదుస్థితిని జూచి జాలిఁ గొని యందుల కొకతరణోపాయమును జూపుట కై యొకమహాపురుషునితోఁ బాటీ యామను మాకుఁ బ్రసాదించితివి. ఈ పె నీనియమము ననుసరించి దివ్యసేవ యొనరించి మమ్ములను విడిచి మఱల నిమ్ముఁ జేరినది. కావున ప్రభూ! పవిత్రమైనయీ మహాత్మకు శాంతిని దయసేయుము. శాంతిని దయసేయుము.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

వ. ఈకీర్తన.

తే. ఆనందాశ్రమమందుఁ బ్రార్థనము • యథావిధిని జరగించి
యానాటిరేయియేడుగంటలకు • నాయాపనులముగించి.

వ. చిన్నవోయినవదనంబుల నెవరిసదనంబులకు వారరుఁగుదెంచిరి.

తే. గీ. చంద్రకళ లేనిరాత్రి • చందమునను
రాజహంసి లేనట్టిన • రస్సుమాడ్కిఁ
శారి లేనట్టిమేటిపం • జరముభాతిఁ
గానఁబడెఁ దోట తేజోవి • హీన మగుచు.

తో. పట్టణమంతయు నెచ్చటఁజూచినఁ ♦ బరమసాధ్వియను మాట
పుట్టివిచారము ప్రాకిపోయెస్త్రీ ♦ పురుషజనావళినోట.

తో. చాలునట్టి మేలయినజీవనము ♦ జామోచాలుభువిలోన
వేలకొలఁదివత్సరములుబ్రదికిన ♦ నేలాసుకృతవిహీన.

కమాచి—చతురశ్రగతి.

ప॥ ధన్యురాలనఁబడియెన్, ఆ మాన్యచరితబహు ॥ధ॥

అ॥ప॥ అన్యదైవముల వేడలేదు పతి నహర్నిశమ్మును వీడ లేదు ॥ధ॥

చ॥ ౧ సర్వబంధులవిడిచిపతికిఁగడు సాయముఁ జేయుచుఁదోడి వారలలో గర్వమునొకలేశంబును జెందక, కాంతాకుల తిలకంబననొప్పెను ॥ధ॥

౨ పతికిముందుగాఁదనుఁ గొంపోమ్మని భగవంతునిబ్రార్థించినదఁట యా పతిభక్తురాలిమాటకులోఁబడి పరమాత్ముండటులే యొనరించెను ॥ధ॥

3 అనుపమానమగు సేవఁజేసి మనయాంధ్రసతుల కెంతో వన్నెఁదెచ్చెను తనువనిత్యమని ధర్మమెసతమని దైవ ముఖముఁజూచి ఫలముఁగోరక ॥ధ॥

౪ కలకలలాడెడు నెమ్మొగమ్ముతో నలలక్ష్మియొయిట్టుల వచ్చినదనఁ బలువురుపలువిధములఁ బొగడంగా సలలిత గతిజీవయాత్రఁ గడపెను ॥ధ॥

తో. పరిణవరూపమై పూవుఁదోటలో ♦ పలుఁగిలుదాయిల్లాలు
అణుమాత్రము సందియము లేదు జను ♦ లందఱుఁగనుఁ
గొనవీలు.

సీ. పనులయందును దాసి ♦ వ్యవహారమున మంత్రి
రూపంబునను లక్ష్మి ♦ యోపిక భువి
యాదరమున దల్లి ♦ యలపాన్పునను రంభ
యని పెద్ద లాడిన ♦ యాఱుగుణము
లనుధర్మపత్నినా ♦ ఘనకీర్తి గడియించి
యాయూనమును జెంద ♦ నట్టిరీతిఁ
బువ్వులరథ మట్లఁ ♦ గోమెస్వర్గానకుఁ
దనజాతిసతులకుఁ ♦ దారిఁ జూపి
తే. గీ. యాంధ్రులకునెల్ల గౌరవం ♦ బమరఁ జేసి
సర్వమతములవారల ♦ సానుభూతి
కర్హ యై ప్రఖ్యాత యైనట్టి ♦ యాత్రఁజేసెఁ
బూజ్యరా లామె లోకసం ♦ పూజ్యరాలు.
తే గీ. ఎంతచెప్పినఁ దీర దా ♦ యింతిచరిత
మొకటిరెండాడి యిఁకమీఁద ♦ నూఱకుందు
నామె యాంధ్రులపాలిఁటి ♦ కామధేను
వామెఁ బోలిననారీల ♦ లామ లేదు.

వ. జే! ఆంధ్రమాతకు జే! జే! యాంధ్రజాతికి జే!

సీ. ఉదయాస్తమయముల ♦ నొనరంగభగవంతుఁ
బ్రార్థింపుచుండెడు ♦ భక్తురాలు

పతిపాదసేవయే ♦ భాగ్య మ్మనుచుఁ దెల్పు,
మార్గ దర్శినియైన ♦ మాన్యురాలు
సంగీతసాహిత్య ♦ సత్కవిత్వ[illegible]ల,
వాసిఁ గన్న[illegible] ♦ ద్[illegible]సురాలు
స్త్రీలెల్లఁ బాత్రిర్థనఁ ♦ [illegible]యున [illegible]జంబుఁ,
దనరంగ నిల్పిన ♦ ధన్యురాలు
తే. గీ. రాజ్యలక్ష్మమ్మ[illegible] [illegible]యాంధ్రి ♦ రాజ్యలక్ష్మ
మనుచుఁ జెప్పంగఁ దగినట్టి ♦ యతివ[illegible]
యట్టియిల్లాలు చిరకాల ♦ మాంధ్రిజనుల
కేలద[illegible]ను నాయువు ♦ చాలనపుడు.

జంఝూటిరాగము——ఏకతాళము

౧. జయజయహారతి జయమాంధ్రిభారతీ
జయమహి[illegible]మతీ జయశోభనాకృతీ.
౨ జయమంగళమని సతతమునిన్ గని
నయమునభయమున నతియొనరింతుము ॥జ॥
3 జయముమాప్రిభువునకు జయముమాప్రిజావళికి
జయముకవీంద్రులకు జయమువిద్యార్థులకు ॥జ॥
చ. జయమగురావువంశవర♦చంద్రి[illegible]కున్ మహానీ[illegible]కున్
జయ మగు పీఠికాపురికి ♦ సత్కవిపండితగాయకాళికిన్
జయ మగు నెల్లసాధ్వులకు ♦ సజ్జనకోటికి సర్వభంగులన్
జయ మగు లోకు లందఱకు ♦ సర్వనియంతయనుగ్రిహం
బునన్

సీ. బాల్యవివాహాదు వృద్ధతుల్ దొలఁగింప,
స్త్రీలు సాహాయ్యమ్ము • సేయవలయు
యువతీవివాహముల్ • దివిరిసంస్థాపింప,
స్త్రీలు సాహాయ్యమ్ము సేయవలయు
నన్యదేశమ్ముల కరిగి విద్యను నేర్వ,
స్త్రీలు సాహాయ్యమ్ము • సేయవలయు
రణరంగమున కేగి • రాజభక్తిని జూప
స్త్రీలు సాహాయ్యమ్ము • సేయవలయు
తే. గీ. బురుషవరులకు మీాయూఁతి • దొరకకున్న
ధైర్య ముండదు కాంతామ • తల్లులార
యీామ జీవితమునుమీాఱ • నెంచి చదివి
భర్త కేరీతిఁ దోడ్పడ • వలెనొ కనుఁడి.

ఓమ్‌తత్సత్.

గ. ఇది శ్రీకొవ్వడివంశపయః పారావార రాకాసుధాకర
శరభరాణ్మంత్రి పౌత్రరాజన్న మంత్రి పుత్ర
బుధవిధేయ శేషవేంకటకాశీపతి నామ
ధేయ ప్రణీతము.

ఈదినమున నేను దీనిని విని యానందించినాఁడను.

ది 27-1-18. కందుకూరి వీరేశలింగము.

శ్రీ విద్యానిలయముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము:—1918.

# ప్రకటన

| | |
|---|---|
| గజేంద్రమోక్షము (హరికథ). | రు. 0—4—6 |
| శివ నవనక్షత్రమాల (దండకము కీర్తనలు సహితము) | 0—2—0 |
| శ్రీయాళ రాజచరిత్రము (హరికథ). | 0—2—6 |
| శ్రీ రాజ్యలక్ష్మీవిలాసము (పతివ్రతకథ). | 0—4—0 |

ఇవి వలయువారలు యీదిగువ ''యడ్రసు'' నకు వ్రాసిన బడయం గలరు. (పోస్టుఖర్చులు కొనువారె భరించవలెను.)

బ్రావిద్వాన్ శేష వేంకటకాశీపతి,

కపిలేశ్వరపురము.

(గోదావరిజిల్లా.)

